

# ఆర్యా శతకమ్ (మూక పంచశతి.1)

- భావార్థముతో. -



శ్రీరస్తు

శుభమస్తు

అవిఘ్నమస్తు



సేకరణ: కిరణ్ టైప్ ఇనిస్టిట్యూట్, 41-1/8-13A.,
గౌతమీనగర్,3వ లైను, కృష్ణలంక, విజయవాడ-520 013.
https://madhirafamily.wordpress.com/



# ఆర్యా శతకమ్ (మూక పంచశతి) - భావార్థముతో.

01. కారణపరచిద్రూపా కాంచీపురసీమ్ని కామపీఠగతా।
కాచన విహరతి కరుణా కాశ్మీరస్తబక కోమలాంగలతా॥

పరమ పవిత్రమైన కాంచీపురములో కామపీఠముపై, కారణరూపిణిగా, అన్ని కారణములకు అతీతమైనదిగా, కుంకుమ పూవుల గుత్తులు కలిగిన తీగవంటి శరీరము కలిగి, దయాసముద్రురాలైన, వర్ణించనలవికాని ఒక మహాశక్తి సంచరించుచున్నది.

02. కంచన కాంచీ నిలయం కరధృత కోదండబాణసృణిపాశం।
కఠినస్తనభరనమ్రం కైవల్యానంద కందమవలంబే॥

ఆ శక్తి కాంచీ నగరము నుదుటి తిలకము వంటిది. ఆమె తన నాలుగు చేతులలో పాశము, విల్లు, బాణములు అంకుశము మొదలైన ఆయుధములను ధరించి ఉన్నది. తన మాతృస్థానముల బరువుచే వంగి ఉండి, సకల జగత్తుకు మోక్షమును ప్రసాదిస్తున్న మాతను ప్రార్థిస్తున్నాను.

03. చింతితఫలపరిపోషణ చింతామణిరేవ కాంచినిలయా మే।
చిరతరసుచరితసులభా చిత్తం శిశిరయతు చిత్సుఖాధారా॥

కాంచీపురములో వెలసి ఉన్న ఆ చింతామణి, నేను కోరిన కోరికలన్నీ సిద్ధింపచేస్తున్నది. అత్యంత పుణ్యాత్ములకు మాత్రమే ఆ తల్లి సులభముగా వశు రాలవుతుంది. తన అమృతమయమైన ధారలతో ఆమె నా బాధతో నిండిపోయిన మనసుకు శాంతిని ప్రసాదిస్తుంది.

04. కుటిలకచం కఠినకుచం కుందస్మితకాంతి కుంకుమచ్ఛాయం।
కురుతే విహృతిం కాంచ్యాం కులపర్వతసార్వభౌమసర్వస్వం॥

వంకీలు కలిగిన కేశపాశములు, కఠినములైన మాతృస్థానములు, మల్లెపువ్వులా తెల్లని కాంతిగల చిరునవ్వు, కుంకుమవంటి ఎరుపువర్ణముకలిగిన దేహకాంతి కలిగి, పర్వతరాజైన హిమవంతుని గారాబుపట్టి కాంచీపురమునందు సంచరించు చున్నది.

05. పంచశరశాస్త్రబోధన పరమాచార్యేణ దృష్టిపాతేన।
కాంచీసీమ్ని కుమారీ కాచన మోహయతి కామజేతారమ్॥

అమ్మ క్రీగంటి చూపులు, కాముని దహించిన ఈశ్వరునే మోహింప చేయ గలిగాయంటే, ఆ చూపులు, కామ శాస్త్రమును బోధించుటలో ప్రవీణులైన గురువులవంటివే కదా.

06. పరయా కాంచీపురయా పర్వతపర్యాయపీనకుచభరయా।
పరతంత్రా వయమనయా పంకజసబ్రహ్మచారిలోచనయా॥

పర్వతములను పోలి, సర్వజగత్తుకు పోషణకారకములైన మాతృస్థానములతో, పద్మములవంటి కన్నులతో కాంచీపురములో వెలసిన మాతకు నేను దాసానుదాసుడను.

07. ఐశ్వర్యమిందు మౌళేరైకాత్మ్యప్రకృతి కాంచిమధ్యగతం।
ఐందవ కిశోరశేఖరమైదంపర్యం చకాస్తి నిగమానామ్॥

ఈశ్వరునికే ఐశ్వర్యప్రదాత, అద్వైతజ్ఞానమును ప్రసాదించునది, సర్వ వేదముల సారమైనది, చంద్రరేఖను శిరసున ధరించినది అయిన తల్లి కాంచీపుర మధ్యములో వెలుగుచున్నది.

08. శ్రిత కంపా(ప)సీమానం శిథిలితపరమశివధైర్యమహిమానం।
కలయే పా(ప)టలిమానం కంచన కంచుకితభువనభూమానమ్॥

కంపానదీ తీరములో స్థితురాలైనది, నిగ్రహవంతుడైన పరమశివుని నిగ్రహమునే చలింపచేసినది, మన్మధుని పునర్జీవుతుని చేసినది, సమస్త భువనములను వస్త్రముగా ధరించినది, ఎరుపు వర్ణముతో ప్రకాశించు మాతను మనసులో ధ్యానిస్తున్నాను.

09. ఆదృతకాంచీనిలయామాద్యామారూఢ యౌవనాటోపామ్।
ఆగమవతంసకలికామానందాద్వైతకం దలీం వందే॥

కాంచీపురమును చల్లగా చూసి కాపాడే ఆదిశక్తి, నిత్య యౌవనవతియైనది, ఉపనిషత్తుల సారమైనది, అద్వైతానందరూపిణి యైనది అయిన మాతకు నమస్క రిస్తున్నాను.

10. తుంగాభిరామకుచభరశృంగారిత మాశ్రయామి కాంచిగతమ్।
గంగాధరపరతంత్రం శృంగారాద్వైతతంత్రసిద్ధాంతమ్॥

మహోన్నతములు, శృంగారభరితములు అయిన మాతృస్థానములు కలిగినదియు, శృంగార విద్య, తంత్ర శాస్త్రములలో ప్రవీణురాలు, గంగను ధరించినవానికి వశవర్తి అయిన జగన్మాతను స్మరిస్తున్నాను.

11. కాంచీరత్నవిభూషాం కామపి కందర్పసూతికాపాంగీమ్।
పరమాం కలాముపాసే పరశివ వామాంక పీఠికాసీనామ్॥

కాంచీపురమునకు మణిహారముగా ప్రకాశించునది, తన క్రీగంటి చూపులతో మన్మధుని పునర్జీవితుని చేసినది, జగదీశ్వరుని వామ భాగమును తన స్థానముగా చేసుకొనినది అయిన జగన్మాతను ప్రార్థిస్తున్నాను.

12. కంపాతీరచరాణాం కరుణాకోరకితదృష్టిపాతానామ్।
కేళీవనం మనో మే కేషాంచిద్భవతు చిద్విలాసానామ్॥

అమ్మా, నా మనసు ఒక క్రీడా స్థలము. కంపానదీ తీరములో ఉన్న ఆ క్రీడా స్థలములో దయాసముద్రురాలవైన నీవు చిద్విలాసముగా సర్వత్ర విహరిస్తూ ఉండాలని ప్రార్థిస్తున్నాను.

13. ఆమ్రతరుమూలవసతేరాదిమపురుషస్య నయనపీయూషమ్।
ఆరబ్ధయౌవనోత్సవ మామ్నాయరహస్య మంతరవలంబే॥

ఒక మామిడి చెట్టు క్రింద నివాసుడైన ఏకామ్రనాధుడైన ఈశ్వరుని మూడు నేత్రములైన సూర్య, చంద్ర, అగ్నులకు నీ దృక్కులు అమృతపానమువంటివి. సర్వ వేద స్వరూపిణి, నిత్య యౌవని అయిన తల్లిని ప్రార్థిస్తున్నాను.

14. అధికాంచి పరమయోగిభిరాది మపరపీఠసీమ్ని దృశ్యేన।
అనుబద్ధం మమ మానస మరుణిమ సర్వస్వసంప్రదాయేన॥

అమ్మా, ఈ సకల ప్రపంచమును నీవు తన రక్త వర్ణములో ముంచి వేస్తావు. అటువంటి ఎరుపు వర్ణములో, కాంచీ పురములో నెలకొన్న నిన్ను యోగీశ్వరులు, ఏ రూపములో సందర్శిస్తారో, ఆ రూపముతో ఉన్న మాత నన్ను కరుణించుగాక.

15. అంకితశంకరదేహామంకురితో రోజకంకణాశ్లేషైః।
అధికాంచి నిత్యతరుణీమద్రాక్షం కాంచిదద్భుతాం బాలామ్॥

ఒక నిత్య యౌవన యైన బాలా స్వరూపము శంకరుని దేహమును తన అంకిత సీమగా చేసుకున్నపుడు, ఆమె కౌగిలింతల అంకములు ఈశ్వరుని శరీరముపై ఏర్పడినవి. అటువంటి జగన్మాతను నేను కాంచీపురములో తిలకించాను.

16. మధురధనుషా మహీధరజనుషా నందామి సురభిబాణజుషా।
చిద్వపుషా కాంచిపురే కేళిజుషా బంధుజీవకాంతిముషా॥

పర్వతరాజ పుత్రికగా జన్మించి, మంకెన పూవుల వర్ణమువంటి ఎర్రని వర్ణముతో, పూల బాణములను ధరించి కాంచీపురములో క్రీడిస్తున్న తల్లిని నేను మానసికముగా తిలకిస్తున్నాను.

17. మధురస్మితేన రమతే మాంసలకుచభారమందగమనేన।
మధ్యేకాంచి మనో మే మనసిజసామ్రాజ్యగర్వబీజేన॥

క్లీంకార స్వరూపిణిగా, సకల జగత్తుల పోషణా స్థానములైన మాతృస్థానముల భారముతో మందగమనయై ఈశ్వరుని శృంగారాధిదేవతయై, కాంచీ పురములో సంచరించే అమ్మను తిలకించి నా మనసు సంతోషముతో పులకరిస్తున్నది.

18. ధరణిమయీం తరణిమయీం పవనమయీం
గగన దహన హోతృమయీమ్।
అంబుమయీ మిందుమయీ మంబా మనుకంప మాదిమామీక్షే॥

పంచభూతములైన భూమి, ఆకాశము, అగ్ని, నీరు, వాయువు, మరియు సూర్యచంద్రులలో నిండి, మహేశ్వర తత్త్వముతో నిండిన మాతృమూర్తి కంపానదీ తీరములో సంచరిస్తుండగా చూసిన నా మనసు ఆనంద పరవశమౌతున్నది.

19. లీనస్థితిమునిహృదయే ధ్యానస్తిమితం తపస్యదుపకంపమ్।
పీనస్తనభరమీడే మీనధ్వజ తంత్రపరమతాత్పర్యమ్॥

అమ్మా! నీవు అంతర్ముఖ సమారాధ్యవు. కాంచీపురములో తపస్సు చేస్తున్న నిన్ను, యోగులు మానసికముగా దర్శించారు. ఆ రూపమునే నేను కూడా దర్శించి ధ్యానము చేస్తున్నాను.

20. శ్వేతా మంథరహసితే శాతా మధ్యే చ వాఙ్మనోతీతా।
శీతా లోచనపాతే స్ఫీతా కుచసీమ్ని శాశ్వతీ మాతా॥

జగన్మాతా! నీకు ఆది అంతములు లేవు. మందస్మితవదనారవిందవు నీవు. క్షీరముతో నిండి ఉన్న మాతృస్థానముల బరువుతో వంగిన సన్నని నడుము కలిగిన చక్కని తల్లివి నీవు. నీ రూపము భావనాతీతమైనది. అటువంటి పరబ్రహ్మమును ఆరాధిస్తున్నాను.

21. పురతః కదానుకరవై పురవైరివిమర్ధపులకితాంగలతామ్।
పునతీం కాంచీదేశం పుష్పాయుధవీర్యసరసపరిపాటీమ్॥

మన్మధుని వీరత్వము అమ్మ ప్రసాదించినదే. అటువంటి అమ్మ యొక్క సన్నని దేహము ఈశ్వరుని ఆలింగనంలో ఆనందములో మునిగి తేలుతుంది. కాంచీపురమును చల్లగా చూస్తున్న ఆ తల్లి నాకు ఎప్పుడు ప్రత్యక్షమవుతుందో కదా?

22. పుణ్యా కాపీ పురంధ్రీ పుంఖితకందర్పసంపదా వపుషా।
పులినచరీ కంపాయాః పురమథనం పులకనిచులితం కురుతే॥

మన్మథుడు చేసుకున్న పూర్వజన్మముల పుణ్యఫలితంగా, జగన్మాత అతనికి సుందర శరీరాన్ని సంక్రమింప జేసింది. అటువంటి తల్లి కంపానదీ తీరములోని ఇసుకతిన్నెలపై విహరిస్తున్నది. ఆ పతివ్రతా శిరోమణి దర్శన మాత్రముననే ఈశ్వరుడు పులకాంకిత శరీరుడవుతున్నాడు.

23. తనిమాద్వైతవలగ్నం తరుణారుణసంప్రదాయతనులేఖమ్।
తటసీమని కంపాయాస్తరుణిమ సర్వస్వమాద్యమద్రాక్షమ్॥

కంపానదీ తీరములో, పూర్వజ, సనాతనురాలు, నిత్య యౌవని, ఎరుపు వర్ణము కలది, సన్నని కటిప్రదేశముతో సంచరిస్తున్న మాతను నేను తిలకించాను.

24. పౌష్టికకర్మవిపాకం పౌష్పశరం సవిధసీమ్ని కంపాయాః।
అద్రాక్షమాత్తయౌవనమభ్యుదయం కంచిదర్ధశశిమౌళేః॥

కామదేవుడైన మన్మధుడు, అనేక పుష్టికరమైన కర్మలను చేసి, వాటి ఫలితముగా, తల్లియొక్క యౌవనదశను పోలిన రూపాన్ని పొందాడు. అటువంటి స్త్రీ చంద్రశేఖరుడైన ఈశ్వరునికి భాగ్యదేవతగా లభించింది. అటువంటి సుందర స్త్రీ మూర్తి నాకు కంపానదీ తీరములో దర్శినమిచ్చింది.

25. సంశ్రిత కాంచీదేశే సరసిజదౌర్భాగ్యజాగ్రదుత్తంసే।
సంవిన్మయే విలీయే సారస్వతపురుషకారసామ్రాజ్యే॥

చంద్రుని తన కిరీటములో మాత ధరించినపుడు కమల పుష్పములు కృంగిపోయాయి. జ్ఞానస్వరూపిణీ, సమస్త సారస్వత అధికారిణి అయిన అమ్మలో నేను ఎప్పుడు లీనమవుతానో?

26. మోదితమధుకరవిశిఖం స్వాదిమసముదాయసారకోదండమ్।
ఆదృతకాంచీఖేలనమాది మమారుణ్యభేదమాకలయే॥

చేత చెరకు విల్లును, దానికి కావలసిన పుష్పబాణములను ధరించి, కాంచీపురము నందు క్రీడించుటకు ఇష్టపడే మాతను మనసులో ధ్యానిస్తున్నాను.

27. ఉరరీకృత కాంచిపురీ ముపనిష దరవింద కుహర మధుధారామ్।
ఉన్నమ్రస్తనకలశీముత్సవలహరీ ముపాస్మహే శంభోః॥

కాంచీపుర నివాసియైన జగన్మాత తన ఉన్నతమైన మాతృస్థానములతో ఈశ్వరునకు ఆనందమును కలిగించు చున్నది. సహస్రారములోని, ఉపనిషత్తులనే పద్మములనుండి తేనెను కురిపించే దేవిని ప్రార్థిస్తున్నాను.

28. ఏణశిశుదీర్ఘలోచనమేనః పరిపంథి సంతతం భజతామ్।
ఏకామ్రనాథజీవితమేవం పదదూరమేకమవలంబే॥

జగదంబ నేత్రములు జింకపిల్ల కనులవలే అతి సుందరమైనవి. తనను ఆరాధించే వారిని ఆ కనులు బ్రోచి రక్షిస్తాయి. ఈశ్వరునికే శక్తిప్రదాతయైన మాత నాకు శక్తిని ప్రసాదించుగాక.

29. స్మయమానముఖం కాంచీమ(భ)యమానం కమపి దేవతాభేదమ్।
దయమానం వీక్ష్యముహుర్వయమానందామృతాంబుధౌ మగ్నాః॥

దయారస దృక్కులతో, ముఖమున చెరగని చిరునవ్వుతో, సహస్రారములో పతితో క్రీడించి తిరిగి కాంచీపురమునకు విచ్చేసే మాత నన్ను ఆనంద సాగరములో ముంచివేసింది.

30. కుతుకజుషి కాంచిదేశే కుముదతపోరాశిపాకశేఖరితే।
కురుతే మనోవిహారం కులగిరిపరిబృఢకులైక మణిదీపే॥

పర్వతరాజైన హిమవంతుని ఇంట జనించి, ఆయన వంశమును ఉద్ధరించి, కలువపూవులరేడైన చంద్రరేఖను శిరసున ధరించి, కాంచీపురములో విహరిస్తున్న తల్లి ఒడిలో నేను శిశువుగా ఇమిడిపోతాను.

31. వీక్షేమహి కాంచిపురే విపులస్తనకలశగరిమపరవశితమ్।
విద్రుమసహచరదేహం విభ్రమసమవాయసారసన్నాహమ్॥

సకల జగత్తులను పోషించగలిగిన మాతృస్థానములు కలిగి, పగడమును పోలిన ఎర్రని శరీర కాంతితో ప్రకాశిస్తూ, ఆకర్షణీయమైన నడకతో ఉన్న అమ్మ కాంచీపురములో వెలసి ఉన్నది.

32. కురువిందగోత్రగాత్రం కూలచరం కమపి నౌమి కంపాయాః
కూలంకషకుచకుంభం కుసుమాయుధవీర్యసారసంరంభమ్॥

కురువింద మణులవంటి పర్వతముల యొక్క ఎర్రని శరీర కాంతి కలిగి, ఉన్నతములైన మాతృ స్థానముల బరువుతో, మన్మథుని యొక్క శక్తులనన్నిటినీ తాను స్వాధీనము చేసుకుని, ఈశ్వర సమాగమమునకు సమాయత్తమైన తల్లికి నమస్క రిస్తున్నాను.

33. కుట్మలిత కుచకిశోరైః కుర్వాణైః కాంచిదేశసౌహార్దమ్।
కుంకుమశోణైర్నిచితం కుశలపథం శంభుసుకృతసంభారైః।

కాంచీపురమునకు, ఈశ్వరునికి పుణ్య సంపదగా, కుంకుమ వర్ణపు ఎరుపుతో శోభిల్లే మొగ్గలవంటి స్తనసంపద కలిగిన మాతృమూర్తి మా మార్గమును సుసంపన్నము, క్షేమకరము చేయుగాక.

34. అంకితకచేన కేనచిదంధం కరణౌషధేన కమలానామ్।
అంతఃపురేణ శంభోరలంక్రియా కాపి కల్ప్యతే కాంచ్యామ్॥

అమ్మ యొక్క శరీరమే ఈశ్వరుని నివాస స్థానము. తన సిగలో ఆ తల్లి అలంకరించుకున్న చంద్రరేఖ నుండి వెలువడు కాంతి, కమలములను ఆకర్షింప చేయు చున్నది. ఈ విధముగా ప్రకాశిస్తున్న జగన్మాత కాంచీపురములో వెలసి ఉన్నది.

35. ఉరరీకరోమి సంతతమూష్మలఫాలేన లాతం పుంసా।
ఉపకంపముచిత ఖేలనముర్వీ ధరవంశసంపదున్మేషమ్॥

విచిత్రమేమిటంటే, తన మూడవ నేత్రముతో విస్ఫులింగాలను వెదజల్లే శివుడు, అమ్మను మాత్రం నిరంతరం లాలిస్తున్నాడు. హిమవంతుని వంశమునకు కీర్తి తెచ్చిన తల్లిని మనసులో ఆరాధిస్తున్నాను.

36. అంకురితస్తనకోరకమంకాలంకార మేకచూతపతేః।
ఆలోకేమహి కోమలమాగమసల్లాప సారయాథార్థ్యమ్॥

ఆగమ శాస్త్రములు, వేదములు జగన్మాతను వేనోళ్ల కొనియాడుచున్నవి. కాంచీపురములోని ఆమ్ర వృక్షమునకు పెనవేసుకున్న తీగవలె, ఈశ్వరుని పెనవేసుకున్న మాత మమ్ములను అనుగ్రహించుగాక.

37. పుంజితకరుణముదంచితశింజిత మణికాంచి కిమపి కాంచిపురే।
మంజరితమృదులహాసం పింజరతనురుచి పినాకిమూలధనమ్॥

కామాక్షి అపార దయాసముద్రురాలు. ఎరుపు, పసుపు వర్ణముల మిశ్రితమైన గౌర వర్ణముతో శోభిల్లు శరీర కాంతి కలది. ఆమె మొలకు కట్టబడిన చిరుగంటలు చక్కటి ధ్వనులు చేస్తుండగా, ఈశ్వరుని అలరించే మాత కాంచీపురములో స్థితురాలై ఉన్నది.

38. లోలహృదయోస్మి శంభోర్లోచన యుగళేన లేహ్యమానాయామ్।
లా(ల)లితపరమశివాయాం లావణ్యామృత తరంగమాలాయామ్॥

పరమేశ్వరి తన అపూర్వమైన లావణ్యముతో ఈశ్వరుని లాలిస్తున్నది. ఆ లావణ్యమును ఈశ్వరుడు తన నేత్రములతో తదేక దృష్టితో తిలకిస్తున్నాడు. ఆ విధముగా ఈశ్వరునికి ప్రీతిపాత్రురాలైన దేవి నన్ను అనుగ్రహించుగాక.

39. మధుకర సహచర చికురైర్మదనాగమ సమయదీక్షిత కటాక్షైః
మండిత కంపాతీరైః మంగళ కందైర్మమాస్తు సారూప్యమ్॥

తుమ్మెదల సమూహమును పోలిన నల్లని కేశ సంపద కల మాత, తనను ఆరాధించే సాధకులకు కేవలము తన క్రీగంటి చూపుతోనే సకల సిద్ధులను ప్రసాదించగలదు. సర్వ మంగళ స్వరూపిణియైన మాత తన సారూప్యమును నాకు కలిగించుగాక.

40. వదనారవింద వక్షోవామాంకతటీ వశంవదీభూతా।
పూరుషత్రితయే త్రేధా పురంధ్రిరూపాత్వమేవ కామాక్షీ॥

కామాక్షీ మాతా! ఈశ్వరుడు త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, రుద్ర రూపములలో ఉద్భవించగా, నీవు వారి యొక్క వామ భాగములోను, ముఖములోను, హృదయము లోను, సరస్వతి, లక్ష్మి, పార్వతి రూపములలో మూడు శక్తులుగా వెలసావు.

41. బాధాకరీం భవాబ్ధేరాధా రాద్యంబుజేషు విచరంతీమ్।
ఆధారీకృతకాంచీం బోధామృత వీచిమేవ విమృశామః॥

అమ్మా! ఈ సంసార సాగరమునకు నీవు ఎంతో బాధ కలిస్తావు. మూలాధార చక్రమునుండి సహస్రార చక్రమువరకు ఉన్న షట్చక్రములలో నీవు విహరిస్తుంటావు. కాంచీపురము వేదికగా సమస్త విశ్వమును అనుగ్రహిస్తున్న నిన్ను నిరంతరం స్మరిస్తాను.

42. కలయామ్యంతః శశధరకలయాంకిత మౌళి మమలచిద్వలయామ్।
అలయామాగమపీఠీ నిలయాం వలయాంక సుందరీమంబామ్॥

నీ సిగ పదహారవ చంద్రకళ చేత అలంకరించబడినది. జ్ఞానమే నీ స్వరూపము. సర్వ ఆగమములను పీఠముగా చేసుకొని బిందు స్వరూపుడైన ఈశ్వరుని ఆశ్రయించి ఉన్న కుండలినీ స్వరూపమైన నిన్ను ఆరాధిస్తాను.

43. శర్వాదిపరమసాధక గుర్వానీతాయ కామపీఠజుషే।
సర్వాకృతయే శోణిమగర్వాయాస్మై సమర్ప్యతేహృదయమ్॥

సదాశివ సమారంభం గురువులందరూ కూడా, శ్రీ విద్యవైన నిన్ను సర్వవ్యాప్తం చేశారు. ఎర్రని ఎరుపుతో కాంచీపురమునందు విలసిల్లి, భక్తులను పాలిస్తున్న నీకు నా హృదయ పుష్పమును సమర్పిస్తున్నాను.

44. సమయా సాంధ్యమయూఖైః సమయా బుద్ధ్యా సదైవ శీలితయా।
ఉమయా కాంచీరతయా న మయా లభ్యత(తే) కిం ను తాదాత్మ్యమ్॥

అమ్మా! నీ దయ నాపై ప్రసరించినట్లయితే, సంధ్యా కాంతిరూపిణి, ఓంకార రూపిణి, ఉమాదేవి, కాంచీ పురమునందు ఈశ్వరునితో కలిసి క్రీడించే తల్లివైన నీలో ఐక్యం కాలేకపోతానా!

45. జంతోస్తవ పదపూజన సంతోషతరంగితస్య కామాక్షి।
బంధో యది భవతి పునః సింధోరంభస్సుబంభ్రమీతి శిలా॥

జగన్మాతా! ఏ భక్తుడైతే నిరంతరము నీ పాదపూజలో నిమగ్నమై ఉంటాడో, వానిని ఈ సంసారము బాధించగలదా. నీ పాదముల ధ్యానమే సాధకుని సంసార బాధల నుండి విముక్తుని చేసి నీటిపై రాతి బండలను తేలేలా చేస్తుంది.

46. కుండలి కుమారి కుటిలే చండి చరాచరసవిత్రి చాముండే।
గుణిని గుహారిణి గుహ్యే గురుమూర్తే త్వాం నమామి కామాక్షి।

మూలాధార చక్రములో కుండలినీ స్వరూపముగా, వక్ర గమనముతో, చరాచర జగత్తును ప్రసవిస్తూ, త్రిగుణ స్వరూపిణివై, హ్రీంకార రూపిణివై, వేదములచే గుప్త విద్యగా పేర్కొనబడిన గురుస్వరూపిణియైన మాతృదేవతకు నమస్కరిస్తున్నాను.

47. అభిదాకృతిర్భిదాకృతి రచిదాకృతిరపి చిదాకృతిర్మాతః।
అనహంతా త్వమహంతా భ్రమయసి కామాక్షి శాశ్వతీ విశ్వమ్।

జీవులలో భేదము, అభేదము, చైతన్యము, జడత్వము, ఇటువంటి రెండు రకములైన భ్రాంతులను విశ్వములో కలిగించి, అందరినీ నీ మాయలో ముంచి తేల్చుతావు నీవు.

48. శివ శివ పశ్యంతి సమం శ్రీ కామాక్షీకటాక్షితాః పురుషాః।
విపినం భవన మమిత్రం మిత్రం లోష్టం చ యువతిబింబోష్ఠమ్॥

తల్లీ! నీ క్రీగంటి చూపులు ప్రసరించినవారు, జ్ఞానులు, సమదృష్టి కలవారు, స్థితప్రజ్ఞులుగా ఉంటారు. అటువంటివారు, భవనమైనా, అరణ్యమైనా, మిత్రుడైన, శత్రువైనా, మట్టిబెడ్డనైనా, సుందరమైన స్త్రీ ఎర్రని పెదవినైనా సమదృష్టితో వీక్షించ గలుగుతారు.

49. కామపరిపంథికామిని కామేశ్వరి కామపీఠమధ్యగతే।
కామదుఘా భవ కమలే కామకలే కామకోటి కామాక్షి॥

కామదేవుని సంహరించిన ఈశ్వరునిచే కామించబడి, కాంచీపురములోని కామకోటి పీఠముపై వెలసిన ఓ కామాక్షీ, నీవు భక్తుల కామ్యములను సిద్ధింపచేసే కామధేనువువు. మాతా నీకు నమస్కారము.

50. మధ్యేహృదయం మధ్యేనిటిలం మధ్యేశిరోపి వాస్తవ్యామ్।
చండ కరశక్రకార్ముక చంద్రసమాభాం నమామి కామాక్షీమ్॥

అమ్మా! హృదయ భాగములో రవితేజముతో 'హృదయస్థా రవిప్రఖ్యా' అనీ, భ్రూ మధ్యములో ఇంద్రధనుసు తేజముతో 'ఫాలస్తేంద్ర ధనుఃప్రభా' అనీ, బ్రహ్మరంధ్రములో చంద్రకాంతిగా, 'శిరస్థితా చంద్రనిభా' అనీ కీర్తింపబడే మాతకు నమస్కరిస్తున్నాను.

51. అధికాంచి కేళిలోలైరఖిలాగమ యంత్రమంత్రతంత్రమయైః
అతిశీతం మమ మానస మసమశరద్రోహిజీవనోపాయైః॥

సర్వ వేదముల యందు, ఆగమములయందు, ప్రకటించబడిన యంత్ర మంత్ర తంత్ర సాధనల వలన కాంచీపురమందు క్రీడించే జగన్మాతచేత, నా మనసులోని తాపము తొలగిపోయి, ఎంతో చల్లబడింది.

52. నందతి మమ హృది కాచన మందిరయంతీ(తా) నిరంతరం కాంచీమ్।
ఇందురవిమండలకుచా బిందువియన్నాదపరిణతా తరుణీ॥

కాంచీపురమును వీడకుండా తన నివాస స్థానముగా చేసుకున్న ఒక స్త్రీ మూర్తి, సూర్య చంద్రులను జగత్పోషకములైన పోషణా స్థానములుగా చేసుకొని, నాద బిందు స్వరూపముగా, ఆకాశ రూపముగా వెలుగుచున్న దేవిని నా హృదయ సీమలో ఆరాధిస్తున్నాను.

53. శంపాలతాసవర్ణం సంపాదయితుం భవజ్వరచికిత్సామ్।
లింపామి మనసి కించన కంపాతటరోహి సిద్ధభైషజ్యమ్॥

కంపానదీ తీరమున కొలువైన కాంచీపురములో, ఔషధ పూరితమైన ఒక తీగ ఉన్నది. ఆ తీగవంటి దేవిని నా శారీరక, సాంసారిక, ప్రాపంచిక జ్వర సంబంధమైన వ్యాధులను నివారించుటకు, మనసులో ధ్యానిస్తాను.

54. అనుమితకుచకాఠిన్యామధివక్షః పీఠమంగజన్మరిపోః।
ఆనందదాం భజే తామానంగ బ్రహ్మతత్వబోధసిరామ్॥

కామదేవుని బూడిద చేసి, ఆ బూడిదను తన వక్షస్థలముపై అలముకున్నవాడు ఈశ్వరుడు. ఆ బూడిదను తొలగించి, తన స్థన చిహ్నములను ముద్రించినది దేవి. సుషుమ్నా నాడిలో నిరంతరం చరిస్తూ, భక్తులను కరుణించే శ్రీ విద్యను నిరంతరం స్మరిస్తాను.

55. ఐక్షిషి పాశాంకుశధరహస్తాంతం విస్మయార్హవృత్తాంతమ్।
అధికాంచి నిగమవాచాం సిద్ధాంతం శూలపాణిశుద్ధాంతమ్॥

సమస్త వేదముల సారమై, ఒక చేతిలో పాశమును, మరొక చేతిలో అంకుశమును ధరించిన విస్మయపరచే రూపము కలిగి, శివుని దేవేరియైన మాత నాకు కాంచీపురములో దర్శనమిచ్చింది.

56. ఆహితవిలాసభంగీమాబ్రహ్మ స్తంబశిల్పకల్పనయా।
ఆశ్రితకాంచీమతులామాద్యాం విస్ఫూర్తిమాద్రియే విద్యామ్॥

ఆ జగన్మాత పూర్వజ. అందరికంటే ముందు ఉన్నది. గడ్డి పరక మొదలు, సృష్టికర్తయైన బ్రహ్మవరకు సృష్టించింది ఆమెయే. ఈ విశ్వములో మొదటి చైతన్యము మాతదే. అటువంటి కాంచీపురములో వెలసిన మాతను నిరంతరం ప్రార్థిస్తాను.

57. మూకోపి జటిలదుర్గతిశోకోపి స్మరతి యః క్షణం భవతీమ్।
ఏకో భవతి స జంతుర్లోకోత్తర కీర్తిరేవ కామాక్షి॥

మూగవాడైనా, భరించలేని కష్టములపాలై దుఃఖభరితుడైనా, అమ్మా అని ఒక్కసారి నిన్ను మనసారా పిలిస్తే, వెంటనే కష్టములన్నీ తొలగిపోయి, అత్యంత గొప్ప వాడిగా మారిపోతాడు. వాని శారీరక, మానసిక వ్యాధులన్నీ తొలగిపోతాయి.

58. పంచదశవర్ణరూపం కంచన కాంచీవిహారధౌరేయమ్।
పంచశరీయం శంభోర్వంచన వైదగ్ధ్యమూలమవలంబే॥

జగన్మాత మంత్ర శరీరము కలది. పంచదశియే ఆ మంత్ర స్వరూపము. పంచ బాణములను చేత ధరించి, ఈశ్వరుని మైమరపింపజేసి తన వశము చేసుకుని, కాంచీపురమునందు విహరించే తల్లి నాకు ఆలంబన మగుగాక.

59. పరిణతిమతీం చతుర్ధా పదవీం సుధియాం సమేత్య సౌషుమ్నీమ్।
పంచాశదర్ణకల్పితమదశిల్పాం త్వాం నమామి కామాక్షి॥

జ్ఞానులైన వారి సుషుమ్నా నాడిలో నాలుగు స్థానములుగాను, షట్చక్రములలోని ఏబది వర్ణములుగా ప్రకలితమై, వారిచే అనేక పదములుగా బహిర్గత మవుతున్న కామాక్షీ దేవికి నా నమస్కృతులు.

60. ఆదిక్షన్మమగురురాడాది క్షాంతాక్షరాత్మికాం విద్యామ్।
స్వాదిష్ఠచాపదండాం నేదిష్ఠామేవ కామపీఠగతామ్॥

పంచాశత్ వర్ణరూపిణీ, మాతృకా వర్ణ రూపిణి అని కీర్తింపబడే, చెరకు వింటిని చేత ధరించి, కామకోటి పీఠముపై స్థితురాలైన తల్లి స్వరూపాన్ని నా గురుదేవులు ఉపదేశిస్తూ, ఆమెను నాకు చూపించారు.

61. తుష్యామి హర్షితస్మరశాసనయా కాంచిపురకృతాసనయా।
స్వాసనయా సకలజగద్భాసన యా కలితశంబరాసనయా॥

అమ్మా, కామదేవుని జయించిన ఈశ్వరుని, నీవు నీ శృంగారముతో సంతోషింప చేసావు. తన యొక్క ఉనికిని కాంచీపురములో వెలయింపచేసి, మాయా స్వరూపిణిగా, అక్కడినుండే సర్వ జగములను పాలిస్తున్న తల్లిని నేను ప్రార్థిస్తున్నాను.

62. ప్రేమవతీ కంపాయాం స్థేమవతీ యతిమనస్సు భూమవతీ।
సామవతీ నిత్యగిరా సోమవతీ శిరసి భాతి హైమవతీ॥

కామాక్షీ దేవికి కంపానదీ తీరమనిన ఎంతో ప్రీతి. యోగీశ్వరుల హృదయములలో సదా కొలువై ఉండి వేదములలో సామ వేద స్వరూపిణిగా, పర్వతరాజు పుత్రికగా, శిరసున చంద్రరేఖను ధరించిన మాత కాంచీపురములో ప్రకాశిస్తున్నది.

63. కౌతుకినా కంపాయాం కౌసుమచాపేన కీలితేనాంతః।
కులదైవతేన మహతా కుట్మలముద్రాం ధునోతు నఃప్రతిభా॥

చేత చెరకు విల్లును ధరించి, అధిదేవతయై, కంపా తీర విహారాసక్తయై, నా మనస్సు అనే కొలనులోని బుద్ధి అనే పుష్పమును వికసింపచేయుగాక.

64. యూనా కేనాపీ మిలద్దేహా స్వాహాసహాయతిలకేన।
సహకారమూలదేశే సంవిద్రూపా కుటుంబినీ రమతే॥

విస్ఫులింగములు ప్రజ్వరిల్లే మూడవ నేత్రము కలిగిన ఒక పురుషునితో అర్ధ శరీరమును పంచుకొని, ఆమ్ర వృక్షముకింద ఒక స్త్రీ జ్ఞానమూర్తిగా, పతివ్రతా శిరోమణిగా వెలసి ఉన్నది.

65. కుసుమశరగర్వసంపత్కోశగృహం భాతి కాంచిదేశగతమ్।
స్థాపితమస్మిన్కథమపీ గోపిత మంతర్మయా మనోరత్నమ్॥

కాంచీపురములో కామాక్షి అనే ధనాగారము స్థితమై ఉన్నది. నా మనసు అనే రత్నాన్ని, ఆ ధనాగారములో పెట్టి భద్రంగా ఉంచి దాచాను కనుక ఇంక ఆ రత్నము దొంగిలింపబడుతుందేమో అన్న శంక నాకు లేదు.

66. దగ్ధషడధ్వారణ్యం దరదలితకుసుంభసంభృతారుణ్యమ్।
కలయే నవతారుణ్యం కంపాతటసీమ్ని కిమపి కారుణ్యమ్॥

సకల జగము నామము, రూపము కలది. అనేక మార్గములలో దట్టమైన అరణ్యము వలె ప్రబలి ఉన్నది. అటువంటి అరణ్యమును దగ్ధం చేయడానికి అమ్మ అగ్ని నేత్రమునుండి వెలువడే ఒక్క అగ్ని కణము చాలు. కుసుంభా పుష్పమువలె రక్తవర్ణముతో యౌవనవతియై, వెలసివున్న దయాసముద్రురాలిని ధ్యానిస్తాను.

67. అధికాంచి వర్ధమానా మతులాం కరవాణి పారణామక్ష్ణోః।
ఆనందపాకభేదామరుణిమ పరిణామగర్వపల్లవితామ్॥

కాంచీ నగరములో స్థితురాలై, ఆనందమునకే ఆనందమైన బ్రహ్మానంద స్వరూపిణియై, నిరంతరము ఆకులతో విస్తరిస్తున్న తీగగా వృద్ధి చెందుతున్న ఆ తల్లి నా కనులకు విందుగా ఎప్పుడు సాక్షాత్కరిస్తుందో కదా!

68. బాణసృణిపాశకార్ముకపాణిమముం కమపి కామపీఠగతమ్।
ఏణధరకోణచూడం శోణిమపరిపాకభేదమాకలయే॥

తన చతుర్భుజములలో బాణము, అంకుశము, ధనుస్సు, పాశము వంటి ఆయుధములుగాను, బాలచంద్రుని సిగలో ఆభరణముగాను ధరించి, కామపీఠమును అధిరోహించిన అరుణవర్ణయైన మాతనుస్మరిస్తున్నాను.

69. కిం వా ఫలతి మమాన్యైర్బింబాధర చుంబి మందహాసముఖీ।
సంబాధకరీ తమసామంబా జాగర్తి మనసి కామాక్షీ॥

అమ్మా, దొండపండువంటి ఎఱ్ఱని పెదవులు కలిగిన చిరునవ్వు ముఖముతో, మాలో ఉన్న అజ్ఞానమును పోగొట్టే మాత నా మనసులో నిరంతరము నిలచి ఉండగా, అన్య దేవతలతో నాకు లభించే ప్రయోజనము శూన్యము.

70. మంచే సదాశివమయే పరిశివమయలలితపౌష్పపర్యంకే।
అధిచక్రమధ్యమాస్తే కామాక్షీ నామ కిమపి మమ భాగ్యమ్॥

జగన్మాత పంచప్రేతాసనాసీన. బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరులు పర్యంకమునకు కోళ్లుగా, సదాశివుడు ఆ పర్యంకమునకు పలకగా అమరి, ఆ పర్యంకముపై శ్రీ చక్ర మధ్యములో పరివేష్టితురాలై కామాక్షీ దేవత వెలసి ఉన్నది.

71. రక్ష్యోఽస్మి కామపీఠీలాసికయా ఘనకృపాంబురాశికయా।
శ్రుతియువతికుంతలీమణిమాలికయా తుహినశైలబాలికయా॥

కాంచీపురములోని కామపీఠములో మనోహరముగా కొలువై, కరుణారసమును కురిపించే ఘనమేఘము వంటిదై వేదములకే మణిహారముగా భాసిల్లే హిమవంతుని పుత్రిక నన్ను కరుణించుగాక.

72. లీయే పురహరజాయే మాయే తవ తరుణపల్లవచ్ఛాయే।
చరణే చంద్రాభరణే కాంచీశరణే నతార్తిసంహరణే॥

ఈశ్వరుని దేవేరివై, మాయా స్వరూపము కలదై, లేత పల్లవముల వర్ణము కలిగి, బాలచంద్రుని సిగలో ధరించి, కాంచీపురములో కొలువై ఆర్తుల బాధలను తొలగించే ఓ కామాక్షీ! నేను నీ పాద పద్మములలో ఐక్యమవుతాను.

73. మూర్తిమతి ముక్తిబీజే మూర్ధ్ని స్తబకితచకోరసామ్రాజ్యే।
మోదితకంపాకూలే ముహుర్ముహుర్మనసి ముముదిషాస్మాకమ్।

ముక్తి నొసగే తల్లివి నీవు. శశాంకుడు నీ సిగలో పుష్పముగా ఉన్నాడు. కంపా నదీ తీరములో చరించుటయందు ఇష్టము గల మాతా! నన్ను నీలో చరించే భాగ్యమును ప్రసాదించుము.

74. వేదమయీం నాదమయీం బిందుమయీం
పరపదోద్యదిందుమయీమ్।
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం
నౌమి విశ్వవికృతిమయీమ్॥

అమ్మా! నీవు లేని ప్రదేశమే లేదు. వేదసారముగాను, నాదస్వరూపముగాను, బిందు స్వరూపిణిగాను, చిదాకాశమునందు, మంత్ర తంత్రములలోనూ, ప్రకృతి వికృతులలోను, అంతటా కొలువై ఉన్న ఓ జననీ నీకు నమస్కారము.

75. పురమథనపుణ్యకోటీ పుంజితకవిలోకసూక్తిరసధాటీ।
మనసి మమ కామకోటీ విహరతు కరుణావిపాకపరిపాటీ॥

త్రిపురహరుడైన ఈశ్వరుని తపఃఫలమై, కరుణారసమూర్తిగా, సకల కవిత్వ జ్ఞానమునకు మూలమైన కాంచీపుర నివాసిని, నా మనసనే సరోవరములో రాచహంసవలె విహరించుగాక.

76. కుటిలం చటులం పృథులం మృదులం కచనయనజఘనచరణేషు।
అవలోకితమవలంబితమధి కంపాతట మమేయమస్మాభిః॥

వంకరలు తిరిగిన కేశ సంపదతో, చంచలమయిన నేత్రములతో, విశాలమైన కటి సీమతో, పద్మములవలె అతి మెత్తని పాదములతో కంపానదీ తీరమున సంచరిస్తున్న తల్లిని దర్శించి శరణు వేడాను.

77. ప్రత్యఙ్ముఖ్యా దృష్ట్యా ప్రసాదదీపాంకురేణ కామాక్ష్యాః।
పశ్యామి నిస్తులమహో పచేలిమం కమపి పరశివోల్లాసమ్॥

అమ్మా! నీ దయ ఒక దీపశిఖ వంటిది. ఆ దీపపు వెలుగులో, ముజ్జగములలో సాటిలేని, పరిపూర్ణస్వరూపమైన పరదేవతను నేను తిలకించ గలుగుతున్నాను.

78. విద్యే విధాతృవిషయే కాత్యాయని కాళి కామకోటికలే।
భారతి భైరవి భద్రే శాకిని శాంభవి శివే స్తువే భవతీమ్॥

బ్రహ్మవిద్యా స్వరూపవు. పదహారు కళలతో ప్రకాశించే మాతవైన నిన్ను, కాత్యాయని, కాళీ, భారతీ, భైరవీ, భద్రా, శాకినీ, శాంభవీ, శివా అనే నామాలతో ఎల్లప్పుడు స్తుతిస్తాను.

79. మాలిని మహేశచాలిని కాంచీఖేలిని విపక్షకాలిని తే।
శూలిని విద్రుమశాలిని సురజనపాలిని కపాలిని నమోస్తు॥

ఓ మాలినీ! ఈశ్వరుని సైతము చలింపచేయగల మాతా, కాంచీపురమందు క్రీడాసక్తి కలదానా, శూలమును ధరించి శత్రు సంహారము చేసే పగడపు హారమును ధరించి, కపాలధారిణియైన శ్రీమాతకు నమస్కారము.

80. దేశిక ఇతి కిం శంకే తత్తాదృక్తవ ను తరుణిమోన్మేషః।
కామాక్షి శూలపాణేః కామాగమసమయతంత్రదీక్షాయామ్॥


Kiron Type Institute
కిరణ్ టైప్ ఇన్స్టిట్యూట్

జగన్మాతా! నీకు నీవే సాటి. నీవు నీ కన్నుల వీక్షణములచే, వేద సంబంధమైన విద్యలయందు, మన్మథ కళలయందు, ఈశ్వరునకే గురుత్వము వహించావేమో అని తోచుచున్నది.

81. వేతండకుంభడంబరవైతండిక కుచభరార్తమధ్యాయ।
కుంకుమరుచే నమస్యాం శంకరనయనామృతాయ రచయామః॥

పరమేశ్వరునికి నేత్రానందమును కలుగచేయు జగన్మాతా! కుంకుమవర్ణమును పోలిన రంగుతో ప్రకాశిస్తూ, గజముల కుంభస్తలముల వంటి మాతృస్థానములతో, వంగిన కటిప్రదేశము కలిగిన మాతా, నీకు ప్రణమిల్లుతున్నాను.

82. అధికాంచితమణికాంచనకాంచీ మధికాంచి కాంచిదద్రాక్షమ్।
అవనతజనానుకంపామనుకంపా కూలమస్మదనుకూలామ్॥

అమ్మా! నీ బంగారు మొలనూలు, మణిమాణిక్యములతో కూర్చబడి అత్యంత సుందరముగా ఉన్నది. 'నీవే తప్ప ఇతఃపరంబెరుంగ' అని ప్రార్థించేవారిని రక్షిస్తూ, కంపా తీరములో విహరించే మాతను నేను కాంచీపురములో దర్శించాను.

83. పరిచితకంపాతీరం పర్వతరాజన్యసుకృతసన్నాహమ్।
పరగురుకృపయావీక్షే పరమశివోత్సంగమంగళాభరణమ్॥

పర్వత రాజైన హిమవంతుని గృహములో జనియించి, వారి ఇంట ఆనందమును పంచి, కంపానదీ తీరములో విహరించి, జగదీశ్వరుని ఒడిలో ఆసీనురాలైన పరదేవతను నా గురుదేవులు నాకు వీక్షింప చేశారు.

84. దగ్ధమదనస్య శంభోః ప్రథీయసీం బ్రహ్మచర్యవైదగ్ధీమ్।
తవ దేవి తరుణిమశ్రీచతురామపాకో న చక్షమే మాతః॥

సతీ వియోగముతో బ్రహ్మచర్యనిష్టలో ఉన్న ఈశ్వరుని నిష్ఠను భంగము చేయదలచిన మన్మథుని కాల్చి బూడిద చేసిన శివుని, నీ యౌవనలక్ష్మిలో గృహస్థుని చేయగలిగావు నీవు.

85. మదజలతమాలపత్రా వసనితపత్రా కరాదృతఖానిత్రా।
విహరతి పుళిందయోషా గుంజాభూషా ఫణీంద్రకృతవేషా॥

అమ్మా! కస్తూరి జలముతో కూడిన కర్ణాభరణములను ధరించి, వృక్షముల ఆకులే వస్త్రములుగా, హస్తమున గునపమును ఆయుధముగా ధరించి, గురువింద గింజల ఆభరణములతో, నాగాభరణయై విచిత్రాకృతితో ఒక పుళింద్ర స్త్రీ కంపానదీ తీరమున విహరించుచున్నది.


Kiron Type Institute

86. అంకే శుకినీ గీతే కౌతుకినీ పరిసరే చ గాయకినీ।
జయసి సవిధే అంబ భైరవమండలినీ శ్రవసి శంఖకుండలినీ॥

చిలుకను తన ఒడిలో కలిగి, అనేకమంది చెలులతో కలిసి గానం చేస్తూ, శంఖములు కర్ణాభరణములుగా ధరించి, భైరవునితో కలసి నా ముందు సాక్షాత్కరించిన మాతా, నా జన్మమే జన్మము.

87. ప్రణతజనతాపవర్గా కృతబహుసర్గా ససింహసంసర్గా।
కామాక్షీ ముదితభర్గా హతరిపువర్గా త్వమేవ సా దుర్గా॥

అమ్మా! కామాక్షీ! నిన్ను శరణు వేడిన వారిని కరుణిస్తూ, సింహవాహనారూఢవై, యుద్ధములో రాక్షసులను మర్దిస్తూ, ఈశ్వరునకు సంతోషము చేకూర్చే దుర్గవు నీవేనా మాతా!

88. శ్రవణచలద్వేతండా సమరోద్ధండా ధుతాసురశిఖండా।
దేవి కలితాంత్రషండా ధృతనరముండా త్వమేవ చాముండా॥

యుద్ధములో అపరాజితగా, నీ వాహనమైన సింహము ఏనుగులపై విరుచుకు పడుతుండగా, రాక్షసుల శిరసులను త్రుంచివేస్తూ, ఆ రాక్షసుల ప్రేగులను గళమున మాలగా ధరించి కపాలధారిణివైన చాముండగా నాకు దర్శనమిస్తున్నావు.

89. ఉర్వీధరేంద్రకన్యే దర్వీభరితేన భక్తపూరేణ।
గుర్వీమకించనార్తిం ఖర్వీకురుషే త్వమేవ కామాక్షి॥

ఓ హిమవత్ పుత్రీ, కామాక్షీ! పూర్తిగా నిండిన అక్షయ పాత్రతో, గరిటెను ఆహారముతో పూర్తిగా నింపి, అన్నార్తులకు కడుపునిండేటట్లుగా వడ్డించే అన్నపూర్ణగా నిన్ను దర్శిస్తున్నాను.

90. తాడితరిపు పరిపీడన భయహరణ నిపుణహలముసలా।
క్రోడపతిభీషణముఖీ క్రీడసి జగతి త్వమేవ కామాక్షీ॥

వరాహముఖముకలిగి, నాగలిని, రోకలిని ధరించి, శత్రు భయంకరిగా, భక్త శుభంకరిగా, ఈ విశ్వములో విహరించే వారాహీ దేవి నాకు నీలో దర్శనమిస్తున్నది.

91. స్మరమథనవరణలోలా మన్మథహేలావిలాసమణిశాలా।
కనకరుచిచౌర్యశీలా త్వమంబ బాలా కరాబ్జధృతమాలా॥

కామదేవుని యొక్క కామకేళీ విలాసములతో, స్వర్ణవర్ణపు కాంతితో, చేత జపమాలతో, మన్మథుని దహించిన ఈశ్వరుని భర్తగా పొందాలని కోరుకున్న బాలా త్రిపురసుందరి నీవే కదా తల్లీ!

92. విమలపటీ కమలకుటీ పుస్తకరుద్రాక్షశస్తహస్తపుటీ।
కామాక్షీ పక్ష్మలాక్షీ కలితవిపంచీ విభాసి వైరించీ॥

ధవళ వర్ణ వస్త్ర ధారిణివై, కమలాసనాసీనవై, అత్యంత విశాలమైన నేత్రములతో, ఒక చేత పుస్తకమును, మరొకచేత రుద్రాక్ష జపమాలను ధరించి, వీణాపాణివై, బ్రహ్మదేవుని దేవేరివైన సరస్వతీ మాతవు నీవేకదా?

93. కుంకుమరుచిపింగమసృక్పంకిల ముండాలిమండితం మాతః।
జయతి తవ రూపధేయం జపపటపుస్తకవరాభయకరాబ్జమ్।

రక్త వర్ణము, పసుపు వర్ణము కలగలిపిన గౌరవర్ణముతో, కపాలమాలను, ధరించి, చేతులలో జపమాల, పుస్తకము, ఒక చేత అభయముద్ర మరొకచేత వరదముద్రను దాల్చిన నీ రూపము అత్యంత ఆశ్చర్యమును కల్గించు చున్నది.

94. కనకమణికలితభూషాం కాలాయసకలహశీతలకాంతికలామ్।
కామాక్షి శీలయే త్వాం కపాలశూలాభిరామకరకమలామ్॥

అమ్మా! నీవు మణిమాణిక్యములు కూర్చిన స్వర్ణాభరణములు ధరించావు. అయితే నీ దేహము నల్లని కాంతితో ప్రకాశిస్తున్నది. చేత శూలమును, గళమున కపాల మాలను ధరించిన నీ రూపమే నిరంతరం నా మదిలో మెదలు తున్నది.

95. లోహితిమపుంజమధ్యే మోహితభువనే ముదా నిరీక్షంతే।
వదనం తవ కుచయుగళం కాంచీసీమాం చ కేపి కామాక్షి॥

నీవు ఈ జగత్తునంతా ఎర్రటి కాంతితో ముంచి వేస్తావు. ఆ అరుణకాంతిలో అమ్మ ముఖమును, మాతృస్థానములను, కటి భాగమును దర్శించే భాగ్యము కేవలము అతి కొద్ది మందికి మాత్రమే కలుగుతుంది. (ఈ శ్లోకములో గమనించవలసినదేమిటంటే, అమ్మను అమ్మగా దర్శించాలి తప్ప, అన్య దృష్టితో చూడకూడదు)

96. జలధిద్విగుణితహుతవహ దిశాదినేశ్వరకళాశ్వినేయదళైః।
నళినైర్మహేశి గచ్ఛసి సర్వోత్తరకరకమలదళమమలమ్॥

జగన్మాతా! నాలుగు దళములు కల మూలాధారమును, ఆరుదళములు కల స్వాధిష్టానమును, పది దళములు కల మణిపూరమును, పన్నెండు దళములు కల అనాహతమును, పదహారు దళముల విశుద్ధమును, రెండు దళముల ఆజ్ఞా చక్రములను దాటి ప్రకాశవంతమైన సహస్రార చక్రమును నీవు చేరుకొంటావు.

97. సత్కృతదేశికచరణాః సబీజనిర్బీజ యోగనిశ్రేణ్యా।
అపవర్గసౌధవలభీమారోహంత్యంబ కేపి తవ కృపయా॥

అమ్మా! నీ దర్శనము పొందాలంటే ముందుగా, సద్గురువు పాదములను ఆశ్రయించి, బీజయుక్తమైన, బీజములు లేని యోగములను గురువునుండి పొంది, వాటిని నిచ్చెన మెట్లుగా చేసుకుని, భవనము పైకి చేరుకుని అచ్చటి వెన్నెలను ఆస్వాదించగలగాలి.

98. అంతరపి బహిరపి త్వం జంతుతతేరంతకాంతకృదహంతే।
చింతితసంతానవతాం సంతతమపి తంతనీషి మహిమానమ్॥

సమస్త జీవుల అంతరాళములలోనూ, బహిరంతరములో నీవే కొలువై ఉన్నావు. నిరంతరము, నీ ధ్యానమగ్నులైన సాధకులను అత్యంత జ్ఞానవంతులుగా, నీ స్వరూపులుగా అనుగ్రహిస్తున్నావు.

99. కళమంజులవాగనుమితగల పంజరగతశుకగ్రహౌత్కంఠ్యాత్।
అంబ రదనాంబరం తే బింబఫలం శంబరారిణా న్యస్తమ్॥

అమ్మా! మన్మథుని ఆలోచన గమనించావా! పంజరములో ఉన్న చిలుకలాగ, నీ గళము అనే పంజరములో ఉన్న మధుర భాషణములనే చిలుకను బయటకు రప్పించడానికి, మన్మథుడు, ఎర్రని దొండపండువంటి పెదవిని ఎర్రగా ఉంచాడు.

100. జయ జయ జగదంబ శివే
జయ జయ కామాక్షి జయ జయ జయాద్రిసుతే।
జయ జయ మహేశదయితే
జయ జయ చిత్ గగన కౌముదీధారే॥

ఓ జగన్మాతా! సర్వ మంగళస్వరూపిణీ, పర్వతరాజ పుత్రీ, ఈశ్వరీప్రియా, చిదాకాశములోని వెన్నెల కాంతి స్వరూపమా, నీకు నిరంతరము జయ జయ ధ్యానములు పలుకుతున్నాను.

101. ఆర్యాశతకం భక్త్యా పఠతామార్యాకృపాకటాక్షేణ।
నిస్సరతి వదనకమలాద్వాణీ పీయూషధోరణీ దివ్యా॥

అమృతము వంటి ఆర్యా శతకమును అచంచలమైన భక్తి భావముతో ఎవరు పఠిస్తారో, వారిపై అమ్మ దయ నిరంతరము ప్రసరించి, వారి నోటినుండి మధుర వాక్కులు వెలువడుతాయి. ఇది సత్యం! సత్యం!! పునః సత్యం!!!

**మూక పంచశతిలోని అయిదు శతకాలలో మొదటిదైన "ఆర్యా శతకం" సంపూర్ణమ్**

**(తరువాతది పాదారవింద శతకం)**

\- - - = - - -

